శా. రాఁడయ్యెన్ మునిరాజు జాడ కనఁగా రాదయ్యెఁ దన్వంగి యి
ల్లేఁడుల్ పూఁడులు నేఁగుదెంచినను గానీ దీక్ష యేమాత్రమున్
వీడంజాలక యుగ్రనిష్ఠ నిలువన్ వెన్వెంటనే లోకముల్
పేడెత్తెన్ నిజధర్మముల్ తొలఁగఁగాఁ ఖెంపేది రార్యర్షులున్. ౨౩

మ. కలగెం దోయధు లెల్లఁ జక్కనినదుల్ గాంభీర్యముల్ వీడి కాఁ
కలఁ దేలం దొడఁగెన్ జగం బులిసె శోకం బందె భూదేవియున్
వెలవెల్వోయె దివాకరుండు ఋషిసద్బృందంబు లెల్లన్ మన
శ్చలనం బందెను తాఱుమాఱయె సమస్తం బింక వేయేటికిన్. ౨౪

ఉ. కర్దమమౌనిచంద్రుఁ డధికంబగు ప్రేముడిఁ జేరవచ్చి "నీ
దుర్దమ నిష్ఠచే జగ మధోగతి పొందఁగ నున్న దమ్మ! యీ
దుర్దశ మాన్పఁగాఁ బరమదుస్సహ మీతప మింత మాను నిన్
గర్దమమౌనిపుత్త్రి వని గాసిలి తిట్టుదు రట్లు కానిచో". ౨౫

మ. అని యెంతెంతని వేఁడుకొన్నఁ జెవియం దావంతయున్ జేర్ప దే
మని మాఱాడదు లోక మెట్లయిన నేమా నాకు నానిష్ఠ నా
కును జాలున్ బలుమాట లేల యిఁక నొక్కొ నాఁగ నాదివ్యదీ
క్షను మౌనంబె సమస్తమున్ దెలుపునాఁగా నుండె సక్కాంతయున్.

గీ. తండ్రి ప్రార్థించి విఫలుఁడై తలఁచె లోన
నిట్టి దుర్దమవ్రత నిజం బెంచి చూడ
నాకు గౌరవహేతువే నాక కాదు
సకలలోక సంరక్షిణి సత్య మంచు. ౨౨

గీ. తండ్రి ప్రార్థించి విఫలుఁడై తప్పుకొనినఁ
దల్లి ప్రార్థించె మిక్కిలిఁ దా నరుంధ
తీరమణి పక్షపాతంబు తేటపఱుప
దయ్యెఁ దలిదండ్రులందు భేదంబుఁ జూపి. ౨౭

గీ. ఋషివతంసులు నొకరొక్కరే క్రమమునఁ
"దల్లి! యుడుగుము నీదీక్ష దయదలిర్ప
లోకముల నేలు" మన్న నాళీకనయన
యతనితోడిద లోకమం చాత్మఁ దలఁచు. ౭౯

మ. తలఁపన్ గొందఱు దీక్షయే యెఱుఁగ రేధర్మంబునుం జూడ రా
ష్ట్రులు వారల్ కడు హీను లెన్నఁగను మందుల్, కొందఱ దీక్షయం
దలఁతిశ్రద్ధను జూపి బాధ యగుచో నావంకకే చూడ, ర
త్యలఘుల్ సువ్రిత ముత్తముల్ విడువ రేయాతంక మే తెంచినన్. ౮౦

ఉ. ఈగతి నాయరుంధతి యహీనమహావ్రత దీక్షచేత స
ద్యోగ మహాగ్ని వెల్వడి మహోన్నతభంగి సమస్తలోకముల్
గ్రాఁగఁగఁ జేయుచుండ సురకామిను లుత్తలమంద నింద్రుఁ డా
వేగముతోడ నేఁగి కడు వేఁడె విరించిని రక్ష సేయఁగన్. ౮౧

మ. చతురామ్నాయము లొక్కపెట్టునను ఘోషలే పెట్టఁ బద్మాసనుం
డతులప్రౌఢిమఁ గోలుపోయినటు లాహా! యంచుఁ జింతించుచున్
మతి దిట్టంబొనరించుకొంచు నిజహంసారూఢుఁడై కర్దమ
వ్రతికూఁతున్ వెదకం దొడంగె మది సంభావించి యేతత్కృతిన్. ౮౨

గీ. నలువ విచ్చేసి యాయరుంధతిని గాంచి
"బిడ్డ! యుడుగుము. నీమనోభీష్ట మేమి ?
జగము లల్లాడిపోయె నీసరణి తగునె ?
మాను వ్రత" మని మఱి బతిమాలుకొనియె. ౮౩

గీ. నలువయంతటివాని నైనను గనంగ
నిష్టపడదాయె మాటాడ నెంచదాయె
నాయరుంధతి నిలుచుండి నట్లె నిలిచి
పట్టినకమండలువు నట్లె పట్టియుండె. ౮౪

ఉ. ఈమెఁ గదల్ప నింక వెఱ వేమియు లే దని బ్రహ్మ యాదిగా
నా మహితర్షిచంద్రులును నద్భుతకంఠనినాద మేర్పడన్
"ఓమహనీయతాపస ! ఋషీశ ! వసిష్ఠమహర్షి ! శీఘ్రమే
యీమహిమాస్పదన్ గనఁగ నిచ్చటికే పఱతేవె సత్కృపన్.

ఉ. నీకృప లేనిచో బ్రదుక నేరము దేవ ! క్షణంబుకూడ నీ
యాకృపగల్గుచోఁ దృణము యేనియు మేరుసమానమే యగున్
మాకయి లోకసంకటము మానుపుకోసము వేగ వచ్చి నీ
వీకమలాయతాక్షి వ్రత మింతకుఁ బూర్ణసమాప్తి చేయవే ! ౧౬

గీ. లోకసంరక్షణార్థమై నీకు జన్మ;
మరయ మముబోంట్ల రక్షించు టగు వ్రతంబు;
కుంభసంభవ ! విచ్చేసి కొమరుమిగులఁ
బెండ్లికొడుకవు కాఁగదే ప్రియ మెసంగ". ౧౭

క. అని వేడుకొనుచు నుండఁగ
మునిమూర్ధన్యుఁడు వసిష్ఠ మునిచంద్రుఁడు న
వ్వినువీథినుండి దిగియెను
ఘనతేజము దిక్కులందుఁ గ్రమ్ముకొనంగన్. ౧౮

ఉ. వచ్చి నమస్కరించిన తపస్వులకెల్లఁ బ్రతిప్రణామముల్
మెచ్చి యొనర్చి పద్మభవు మేదురభక్తి నుతించి వెంటనే
యచ్చపలాక్షిఁ గర్దముని యాత్మజఁ జేరి "లతాంగి ! యీఁగదే
వచ్చితి నాకమండలువు భద్రము చేసితి విచ్చు మెచ్చితిన్". ౧౯

క. అను నవ్వసిష్ఠుపలుకులు
విని కన్నులు విచ్చి చూచి వినమితశిరయై
తనచేతికమండలువును
మునిచేతం బెట్టి కదలి మ్రొక్కె నతనికిన్. ౨౦

మ. సుమవర్షంబులు దేవతల్ కురియ యక్షుల్ కిన్నరుల్ నృత్యమున్
సమదస్ఫూర్తి నొనర్పఁగా మఱియు గంధర్వుల్ జయధ్వానముల్
ప్రమదం బారఁగఁ జేసి గీతవితతిం బాడంగ దివ్యంబు ది
వ్య మటంచున్ జనముల్ నుతింప శుభముల్ ప్రాప్తించె లోకాళికిన్.

గీ. "పడఁతి! లెమ్మింక శుభములు పడయఁగలవు
సిద్ధ మిది త్వన్మనోభీష్టసిద్ధి యగుట"
యని వసిష్ఠుఁ డరుంధతిహస్తయుగళిఁ
బట్టుకొని లేవనెత్తెను బ్రణయ మొప్ప. ౬౨

క. అహహా! మహర్షి పాణి
గ్రహణం బొనరించినంతఁ గన్నియ కప్పుడే
స్పృహ వచ్చి సిగ్గు గదిరినఁ
దహతహపడి లోని కరిగెఁ దరుణులు నవ్వన్. ౬౩

గీ. "తడయఁ జూడకు మింకఁ గర్దమమునీంద్ర!
శీఘ్రముననే వివాహసంసిద్ధిఁ గూర్పు"
మంచు నానతియిచ్చె నాయంచరౌతు
అవ్వసిష్ఠుఁడు వినఁ జిఱునవ్వుతోడ. ౬౪

మ. సుముహూర్తం బది నిశ్చయించుకొని యచ్చో సర్వసంభారముల్
సమకూర్చెన్ బుషికర్దముండు పరమాశ్చర్యంబుగన్ మున్నె యా
త్మమహత్త్వప్రతిపాదకుల్ పరమసంభావ్యాత్ములై నట్టి మా
నిమహాశ్రేష్ఠులుఁ జేయఁజాలనివి యున్నే యెట్టికృత్యంబులున్.

గీ. పెండ్లిపెద్దలు చనుదెంచి విడిసి యుండ
రతనిగృహమందు జామాత లండ అతని
నుతితతులఁ దన్పువా రైరి సతు లొనర్చి
యతఁడు గావింపఁ బెండ్లిండ్ల నబ్బురంబె! ౬౫

మ. తనతో మ్మంద్రుకొమార్తె లిట్లు పరమాత్మజ్ఞానవిజ్ఞానులన్
ఘనమౌనీంద్రుల రూపమన్మథుల నిష్కామ్యాత్మ్యులన్ దేవదే
వనికాయ స్తవనీయులన్ ద్రిభువనప్రఖ్యాతులన్ బ్రహ్మజీ
వనులన్ భర్తలుగా గడించి రని యాబ్రహ్మర్షి యుప్పొంగుచున్.

ఉ. మునికులసంప్రదాయమున మున్నటు లొప్పినశాస్త్రపద్ధతిన్
గని మనమందుఁ గర్దముఁడు కాంచి సదాచరణంబు పీనిమే
శనమునఁ జేయఁబూనెను జెలంగి వివాహమహోత్సవంబులన్
వినుతవిధాన మొప్పఁగఁ బవిత్రగతిన్ సుమనోనుకూలతన్. ౯౮

గీ. బ్రహ్మమునుముందు నతనియాధ్వర్యవమున
సర్వదేవతాఋషిగణసన్నిధాన
మందు దివ్యవైభవముతో నలరెఁ గర్ద
మాత్మజలపెండ్లి లోకంబు లలరఁ బ్రీతి. ౯౯

చ. మునివరసామగానరవముం బురుడించుచుఁ గోకిలాంగనా
జనకలగానమాధురులు షడ్జములన్ బెనుపొందుచుండఁగా
ననవరతంబు నధ్యయనమందునఁ బాల్గొనుకీరరాజముల్
గొనకొని కల్పఁగాఁ దొడఁగెఁగూర్మిశ్రుతిన్ మునివేదఘోషతోన్.

ఉ. నృత్తము సల్పునచ్చరలు నెమ్మికులం బొనరించునాట్యసం
పత్తిఁ దదీయనూతనవిపర్యయముల్ కనినన్ మనంబులన్
హత్తుకొనంగ మైమఱచి యాటలు మాని నిజాత్తశాస్త్ర మా
వృత్తియొనర్చుకోఁ దొడఁగ నెల్లరు నవ్విరి సిగ్గుచేటుగన్. ౧౦౧

చ. అరవిడి నూత్నశోభల నయాచితభంగి దిశాముఖంబులన్
బరఁగఁగఁ జేయు పద్మములఁ బావనభంగిఁ గరేణుయూథముల్
సరసముగా గ్రహించి సుమసంగతిచే గజమాల లెన్నొ చే
కురిచి నవీనదంపతులకున్ గయిసేయును భక్తియుక్తులన్. ౧౦౨

ఉ. మందలు మందలై తమ కమందసుఖం బిది యంచుఁ జెప్పఁగా
డెందములందు నెంచియొ కడిందిపొదుంగులతోడ దివ్యగో
బృందము లాప్రదేశమునకే పఱతెంచి పయస్సులన్ మహా
నందముతోడుతన్ గురిసి నందినులే యనఁ బొల్చు నిమ్ములన్.

గీ. పండి యుండినపండు లీపెండిలికయి
నిల్చియున్నవో నాఁగ నా నిమిషమందె
రాలిపడిపోయి యామునిరాజిభుక్తి
కొఱకుఁ జూపును వారి కకుంఠభక్తి. ౧౦౪

గీ. పిల్లతెమ్మెరలను పంపి మెల్లమెల్ల
వారినును మేనులకు సుఖప్రమద మీయ
వాయుదేవుఁడు చూపు హృద్భక్తియుక్తి
తనసదాగతిత్వమ్ము సార్థకము గాఁగ. ౧౦౫

మ. తనకున్ రక్షకులై జగంబుల నితాంతప్రేమ పాటించుచున్
మనువారేకద ! వీర లంచుఁ దనకున్ మర్యాదగా వారికిన్
దనభక్తిన్ బ్రకటింపఁగా శమితతీక్ష్ణత్వంబునన్ మందమై
యినుఁ డొప్పున్ సమశీతలుం డయి గుణాకృష్టాత్ము లిట్లుండరే !

గీ. స్వచ్ఛమై శారదాభ్రంబుచంద మగుచు
నొప్పె వినువీథి నీలిమ నొప్పుమిగిలి
సరసహృదయంబులను బోలి సరసులందు
నీరములు గాంచె స్వచ్ఛతన్ నిశ్చలతను. ౧౦౬

ఉ. ఈగతిఁ బంచభూతములు హృష్టములై మఱి హృష్టి నిచ్చి తే
జోగరిమన్ జెలంగఁ బరిశుద్ధమనస్కులు సంతసింపఁగా
నాగమవేదులై చెలఁగునార్యఋషీశులఁ జెట్టవట్టి శో
భాగురుతన్ జెలంగిరి శుభప్రదకర్దమపుత్త్రికామణుల్. ౧౦౭

గీ. సృష్టికర్తయు వారి నాశీర్వదించి
యాత్మధామంబునకు నేఁగె నంతమీఁద
తక్కుదేవత లాశీర్విధానములను
గురిసి వారలపైఁ జేరుకొనిరి దివిని. ౧౦౯

వ. ఆ పిమ్మట యథావిధివివాహసంస్కారానంతరము
దేవహూతీకర్దములు తమతొమ్మండ్రుముద్దు
గుమ్మ లగుకూఁతుండ్రను దొమ్మండ్రగు
రల్లుండ్రకు నొప్పగింతలు పెట్టి కన్నులనీరు గ్రమ్ముకొన ౧౧౦

ఆ. "ముద్దుబిడ్డలార! ముదముతోడుత నేఁగి
పతులవెంట వారె గతులు గాఁగ
మమ్ము మఱవకుండ మహితయశస్సును
పార్జనమ్ముఁ గాంచి వఱలుఁ డమ్మ!" ౧౧౧

చ. అని తమకన్యలన్ బతుల కర్పణచేసి సగౌరవంబుగా
ననుపమవస్తుసంతతు లనంతము వారల కిచ్చి నిత్యనూ
తనములు కట్టఁబుట్టములు ధన్యత వారి కొసంగి మేలిభూ
షణము లొసంగి పంపిరి ప్రశాంతమనస్కత వారి నెల్లరిన్. ౧౧౨

గీ. తుద కరుంధతీదేవిని ముదము మీఱ
నవ్వసిష్ఠునితోఁ బంపునవసరమునఁ
గనులవెంబడి నశ్రువాహినులు పాఱె
దేవహూతికిఁ గర్దమధీమణికిని. ౧౧౩

గీ. ఇది యగునరుంధతీవసిష్ఠేష్టకావ్య
రాజమున ద్వితీయాశ్వాసరాజ్య మీశ!
గురువరా! త్వత్కృపామృతభరితమాదు
కీనవాఙ్మయ మిదియు నంకితము నీకు. ౧౧౪

# అరుంధతీ వసిష్ఠము

## తృతీయాశ్వాసము

శ్రీగురు సాంబసదాశివ!
శ్రీగురు పరమాత్మ! జ్ఞానసిద్ధిప్రద! వి
ద్యాగురుచూడామణి! స
ద్యోగీంద్ర! మహానుభావ! యోగనిరూఢా! ౧

గీ. అది వసిష్ఠమహర్షి దివ్యాశ్రమంబు
భూతలస్వర్గ మన్న నా పోలుపులేమి
స్వర్గమందు నలంకార శాస్త్రవిదులు
ఉపమ కుపమానలోపమే యొదవునండ్రు. ౨

చ. అది సుమనోహరంబగు మహావనరాజ మటంచు సమస్తసం
పదలు విరాజిలంగ సహజభంగి ననారతమున్ బ్రసూనముల్
మృదుల లతాళులం దమకు నెప్పుడు వాడుటయుం సుగంధముల్
వదలుట నేలపైఁ బడెడిపాటును లేక చెలంగు స్వచ్ఛతన్. 3

మ. మునికాంతాతిలకంబు లాత్మపతు లాముష్యాయణుల్ చేయు దే
వనికాయార్చనకున్ శుచిస్మితముఖవ్యక్తాత్మతోచున్ లతాం
త విశృంతం బొనరింప వచ్చునెడ ధన్యత్వమ్ము భావించి ప్రీ
తిని బూసెజ్జల రాలు నాసుమతతుల్ దివ్యంబు లేతత్కృతుల్. ౪

గీ. స్వచ్ఛతయు లేక నిస్స్వార్థపరత లేక
కాంతి దాంతియు లేక కర్కశత మెలఁగు
నరులకంటెను బూజ్యముల్ విరులు తలఁపఁ
గాననే వానిఁ దలఁదాల్పఁగంట సతులు. ౫

ఉ. అందు వసంతకాలమె నిరంతరమౌ సుమనోనుకూలమా;
విందులు గూర్చు పీనులకు విశ్రుతిఁ గోకిలబృందముల్; మహా
నంద మొసంగునృత్యముల నమ్ములు; కీరసమూహ మెల్ల దై
నందినమున్ బఠించు శ్రుతి నమ్రత చూపుచు మౌనిజాతికిన్. ౬

గీ. జాతివైరంబు లెఱుఁగ వచ్చటి మృగములు;
మాంసభోజన మొల్లవు; మాయకాని
మర్మమును గాని యెఱుఁగవు; మానితతికి
సేవచేయు మహోన్నతస్థితి వహించి. ౭

గీ. నగరకల్మషవర్తులౌ నరులకంటె
నడవిలో నున్న మృగములే యధికము లని
నగరముల వీడి పూతవనమ్ము లందె
యాశ్రమంబుల నివసించి రార్యఋషులు. ౮

మ. ప్రియ మానిట్టి నిజాశ్రమంబును మహాప్రీతాత్ముఁ డౌచున్ వసి
ష్ఠయమిశ్రేష్ఠుఁడు దివ్యదీధితులతో సౌభాగ్యభాగ్యాన్విత
ప్రియకాంతాతిలకంబుతోడఁ జని చేరెన్ దేవతల్ పుష్పసం
చయవర్షం బొనరింపఁగాఁ బ్రకృతి తేజస్వంతమై యొప్పఁగన్.

చ. చిలుక కొలంపుముత్తవలు చెందొవఱేకుల దండ లీయఁ గో
యిలపువుఁబోండ్లు కెంజిగురు లెల్ల సరంబు లొనర్చి భక్తి నిం
పులు గులుకంగ నీయ మఱి ముద్దుగఁ బాటలు పాడ వారికిన్ లకో
రులు మఱి నమ్మిముత్తయిదులున్ సమకూర్చె గృహప్రవేశమున్.

గీ. ఇటు లరుంధతీకాంతతో ఋషివరుండు
స్వీయ దివ్యాశ్రమంబును జేరి గార్హ్య
ధర్మపరిపాలనా వ్రతతత్పరుఁడయి
యుండె నాదర్శభూతుఁడై యొరులకెల్ల. ౧౧

గీ. పంచభూతంబులున్ భయభ్రాంతము లయి
వారిసేవాపరత్వంబె కోరుకొనియె;
దివ్యసంసార జీవితదీక్షఁ బూను
ధీరవరులకు నెల్ల స్వాధీనమె కద! ౧౨

మ. తనకుం దెచ్చిలు సేవచేయు తెఱంగుల్, ధన్యాత్ము లౌ వృద్ధు ల
ర్చనముల్ పొందెడి తీరులుం, మఱియు శిష్యవ్రాతముం సాకు నే
ర్పును, గోమాతృపదారవిందభజనంబుం భూతసంప్రీతియుం
ముని మూర్ధన్యుఁ డరుంధతీరమణికిం బోధించి సంతుష్టుఁడై. ౧౩

గీ. "తరుణి! సంసారదీర్ఘ యాత్రాపరులకు
నరయ సులభంబు లౌనుపాయములు గలవు
శమదమాన్విత ధర్మమార్గమును బట్టి
పొందవచ్చు యాత్రానంద మిందువదన! ౧౪

గీ. పెంపునఁ దరించి యొరులఁ దరింపఁజేయ
సారవంతంబు నిజము సంసార మగును;
ఆత్మ కుక్షింభరత్వ కామావిల మగు
నీచసంసార మే సర్వనింద్య మగును. ౧౫

క. అసిధారావ్రత మగునో
బిసరుహపత్త్రాక్షి! పరమభీకర పాపా
లస మగు సంసృతిఁ గడచుట
విసమును నమృతంబు నిందు వెలయు లతాంగీ! ౧౬

సీ. ధర్మమార్గంబునఁ దవిలి సత్కర్మంబు
లీశ్వరార్పణబుద్ధి నెవఁడు చేయు
తుచ్ఛోపభోగసంతుష్టిఁ గాంక్షింపక
యింద్రియనిగ్రహ మెవ్వఁ డందు
నియమవ్రతంబుల నిరుపమానంబుగా
నడపించుచుండు నెవ్వఁడు సతంబు
అతిథిదేవులసేవ యభ్యాగతసపర్యఁ
బరమవ్రతంబుగా జరపు నెవఁడు

గీ. వెలయు నాత్మావలోకన వృత్తి నెవఁడు
తనువు-మనువుమ ద్వైతతత్పరత నుంచి
యట్టివానికి సంసార మమృత మగును
కానివానికి విష మగుఁ గంబుకంఠి! ౧౭

గీ. రెండు విధముల నానంద ముండు సతివ !
ఇంద్రియానంద మొకటి నికృష్టమిదియె
ఇంద్రియాతీతమైన దోయిగురుఁబోఁడి !
రెండవది దివ్యమిదియె పూర్ణేందువదన ! ౧౮

ఉ. కామవికారముం దగులుకాపురుషుండు వివేకహీనుఁడై
క్షేమముఁ గాంచలేఁడు దరిసింపఁగలేఁడు యథార్థతత్త్వముల్
నీమము నిష్ఠయున్ నిలుప నేర్చినవాఁడె జయించుఁ గామమున్
గామవిజేతయే తలఁపఁగా నగు జ్ఞానవిశిష్టుఁ డోచెలీ ! ౧౯

సీ. సకలవైదికకర్మ నికరంబు దీక్షతో
నొనరింపఁగా వలె నువిద ! నరుఁడు
కర్మసంత్యాగి కాఁగారాదు నరుఁ డెప్డుఁ
గర్మఫలత్యాగి కావలయును
శ్రద్ధయు భక్తి యాచారంబు నిత్యసం
తోషంబు నరులకుఁ దోడునీడ
ఆత్మావలోకన మహారహాతపమును
బ్రహ్మనిష్ఠునిఁ జేయుఁ బడఁతి ! నరుని

గీ. బ్రహ్మ నిష్ఠాగరిష్ఠ సౌభాగ్య మతివ !
అవని దుర్లభ మెంతవాఁడైనఁగాని
బహుళగత జన్మసుకృత సత్ఫలమున కతన
లభ్యమగుఁ గోటి కొకని కోలలన ! యదియును ౨౦

గీ. బ్రహ్మనిష్ఠులు గాంత్రు శాశ్వతయశస్సు
అవ్యయానందపదము వారధివసించి
జన్మ మృత్యుప్రవాహంబు జాడఁగనరు
అతివ! యితరులు చెడపుర్వు లట్టివారు. ౨౧

శా. పూత బ్రహ్మకులంబునం బొడమి సంభూతాత్మ విజ్ఞాన వి
ఖ్యాతిం గాంచి జగజ్జనావళికి నత్యంతంబు నాదర్శమా
కీర్తిన్ వర్తిలకున్న లోకము చెడున్ రిక్తప్రయత్నంబగున్
నాతీ! బ్రహ్మకు సృష్టికార్యమిటు కానన్ జేయు మేతత్కృతుల్.

గీ. తరుణి! నినుఁ బెట్టినట్టి యీ దర్శగార్హ
ధర్మనిర్వహణంబునఁ దనర నడుగు
పెట్టినాఁడను సద్గుణప్రేరిత వయి
నడపు భారంబు నీయది నలిననయన! ౨౩

చ. ఇతఁ డొకశిష్యరత్నము మహీస్థలి నొంటిపదంబుపైని ని
ల్చి తపము వేయిరేయిం డ్లొనరఁజేసెను సాధ్వి! యితండు భస్మసా
త్కృతు నొనరించి మన్మథుని నీశ్వరుఁబోలి మహోగ్రనిష్ఠ ను
ద్రతియయి వెల్గు నిట్టిగతివారలు మత్ప్రియశిష్యులో సఖీ! ౨౪

మ. నియతాహారులు నిర్జితేంద్రియులు నిర్ణిద్రప్రమోదాన్వితుల్
ప్రియకాంతామణి! శిష్యరత్నములు నిర్లిప్తుల్ భవత్సేవకుల్
ప్రియపుత్రాగ్రణు లట్లు వారికి లసత్ప్రీతిన్ శుశ్రూషాన్న స
త్క్రియఁ దుష్టింబొనరించుచుండుము జగద్విఖ్యాతి నొప్పారఁగన్."

తే. అని బోధింప నరుంధతీరమణి బ్రహ్మానంద సంపూర్ణ భ
ర్తను సాష్టాంగ నమస్కృతిన్ దనిపి శ్రద్ధాభక్తి సంయుక్తయై
వినుతించెన్ "బతిదేవ! నీ దయిన భ్రూవిక్షేపముం బట్టి నీ
కనుసన్నన్ భవదాజ్ఞలన్ నెరపుదున్ గాపాడ నీ వెప్పుడున్. ౨౬

మ. జగదభ్యర్చిత తావకీనపదసంస్పర్శన్ దదారాధనన్
బొంగడొందంగల దేవదేవ! కరుణాపూర్ణుండవై త్వత్కృపా
పగ నాపైఁ బ్రవహింపనిమ్ము మఱి యాపై నేమియుం గోర నిర్
సగుణాకార పరాత్పర ప్రభునిఁగా సమ్యగ్గతిం గొల్చెదన్. ౨౭

ఉ. నాదగు పూర్వపుణ్యమున నాదగు దివ్యతపః ఫలంబునన్
నీదగు పాదపద్మతతి నిస్తులభక్తిని వ్రాలఁగంటి భా
గ్యోదయ మిద్దినాకుఁ గరుణోదధి! నీ కడఁగంటి చూడ్కి యా
హ్లాదపరంపరావహము నవ్యయసౌఖ్య నిధానమున్ ప్రభూ! ౨౮

గీ. కొలుచుకొందును నీపాద జలరుహములు
తలఁచుకొందును నీ నామ తారకంబు
నడచుకొందును నీదగు నడుగుజాడ
నిలుచుకొందును నీదు నిశ్చలమనంబు. ౨౯

చ. ఎఱుఁగుదు నీమహత్త్వము ఋషీశ్వర! తావకపాదపద్మముల్
మఱఁగి చరింపఁగందు బరమంబగు కీర్తిని జూఱగొందు రూ
పఱ సకలాఘముల్ పరమహంస! నినుంగవగూడి హంసినై
నెఱపుదు జీవితాబ్జిని ననింద్యవిహార మనంతకాలమున్. ౩౦

గీ. పరమపావన సద్బ్రహ్మపథ విహార!
భవము భవమున నేను దపం బొనర్చి
కాంచఁగంటిని భవదీయ కరుణ నిట్లు
శాశ్వతం బగు నీకటాక్షంబు దేవ! ౩౧

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము సర్వమునీవె యంచు నా
యుల్లమునం దలంచుచు మహోత్తమభంగి నొనర్చుచుందు సం
ధిల్ల మనః క్రియైక్యము వినిర్మలవాక్సముదంచితంబుగా
వల్లభ! నీసపర్యలు భవత్ప్రియపత్నిగ శాశ్వతంబుగన్. ౩౨

చ. తలఁపఁగ మూఁడులోకముల దంపతులందు నరుంధతీవసి
ష్ఠులె కడు మేలుబంతు లని సూరిజగంబుల శాశ్వతంబుగా
నెలకొనఁగాక దివ్యము ననింద్యమునైన యశోలతాంగి త
ద్విలసిత తావకీనసుపవిత్ర మనోజ్ఞము జృంభితంబుగన్. ౩౩

గీ. లలనలకు జీవితేశ్వరలాలనంబె
పరమపదముగదా! దేవ! పావన త్వ
దీయకరుణా కటాక్ష సందీప్తి సోఁకఁ
దేలియాడుదు నానంద దివ్యవార్ధి. ౩౪

గీ. పతి కటాక్షింప నేపాటియతివయైనఁ
గాంచు ననదృశశక్తులు; కాంతుఁ డహహ!
పరమ యోగీశ్వరేశ్వర ప్రభుఁడెయైన
నతని యాలిమహాభాగ్య మలఁతియె? ప్రభు!" ౩౫

చ. అని పలుకన్ వసిష్ఠుఁడు మహర్షి విభుం డెద సంతసించి యా
మెను బ్రియవాక్యసంపదల మిక్కిలి లాలనచేసి యాపయిన్
వినుత గతిన్ దొడంగె నతిభీకరమైన తపం బొనర్ప భో
జనమును నీరు నిద్రయును సర్వము వీడి మహావ్రతస్థుఁడై. ౩౬

మ. సహధర్మవ్రత చర్యకున్ దొడఁగె నాసాధ్వీమహారత్నమున్
మహనీయం బగురీతి భర్తృపదపద్మస్ఫార సంసక్తి దు
స్సహ దీక్షం గొని శాంతిఁబూనియుఁ దపస్తప్తాంగియై యామె ప్ర
త్యహమున్ భర్తృతపోనవద్యతకుఁ బ్రత్యక్షప్రమాణంబనన్. ౩౭

మ. నవలావణ్య విలాసహాసములు చెన్నారంగ నొప్పారి సం
స్తవనీయం బగు యౌవనంబున మహాసౌందర్య సంశోభితా
ధవులం గూడి రహఃక్రియాకలన మోదప్రాప్తి నున్మత్తలా
ట పరింతు ర్సతు లింతెకాని యిటులుంటల్ లోకసామాన్యమే?

సీ. నిత్యోపవాస వినిర్మల దీక్షలే
షడ్రసోపేత భోజనము గాఁగ
బహిరింద్రియవ్యాప్తి పరిహృతానందంబె
భోగానుభవ సుఖస్ఫూర్తిగాఁగ
శీతవాతాతప శ్రేణి నుదాసీన
భావమే విజయభావంబు గాఁగ
నిశ్చంచల ధ్యాన నిహిత చిత్తమె సక
లేప్సితార్థ మహాభిహితము గాఁగ

గీ. దివ్యదంపతు లగువారి దీక్ష వలన
దశదిశలు దివ్య తేజః ప్రదములుగాఁగ
తొలుత హిమగిరి తనయతోఁ దుహినధాత్రి
శివుఁడు పోల్చినరీతి వసిష్ఠుఁ డొప్పె. ౩౯

గీ. పలుకఁ డేమియుఁ; జేతఁ జూపఁడు వలసిన
వస్తువులఁ; గనుసన్నలఁ బఱుపఁ; డైన
నెటులు గ్రహియించెడిదొ కాని యెల్లయవియుఁ
దఱికిఁ గూర్చెడు నా యరుంధతి క్షణమున. ౪౦

చ. నిలిచినకాలనే నిలిచి నిస్తులమైన తపంబు పెంపునన్
సలలిత బాలభానుగతిఁ జక్కని కాంతులు గ్రక్కు నొక్కటన్
బులకిత దేహుఁడై పరమపూరుషు భక్తిని రక్తి వేదభా
షల నుతియించు నొక్కటఁ బ్రశాంతి వసిష్ఠమహర్షి నిచ్చలున్.

గీ. జలద గంభీరనినదంబు సవదరించి
యతఁ డొనర్చెడు వేదసంస్తుతులు వినఁగ
దిశ లదరు రోదసియు నిండు దివియు భువియు
దద్దరిల్లఁగ బ్రహ్మనాదము జనించు. ౪౧

శా. ఆనందంబున నాతఁ డట్లొనరఁ జేయన్ బ్రహ్మనాదంబు ది
వ్యానందంబున నాశ్రమస్థల సమస్తాశావకాశంబు పెం
పూనన్ దివ్యశమ ప్రశోభితమునై యొక్కమ్మడిన్ జీవనం
తానంబుల్ లయగల్పు నాదమున కానందమ్ముతోఁ జక్కఁగన్.

క. ఆనాదము మేదురమై
కానన మొనరించు బ్రహ్మకాననముగ ది
వ్యానందులు వారే బ్ర
హ్మానందులు వారె యనఁగ నఖిలమునందున్. ౪౪

సీ. అమృతంబుఁ ద్రావ లే దనశనవ్రతమున
క్షుత్పిపాసలఁ ద్రోలఁ జూచె నెట్లు ?
కాయకల్పము లేదు కమనీయ విగ్రహ
దివ్యదీధితిని జెందినది యెట్లు ?
సిద్ధౌషధాదులు సేవింపనే లేదు
దేహబలంబుఁ జెందినది యెట్లు ?
మాయ మంత్రంబుల మఱఁగినదే లేదు
సర్వశక్తులుఁ గాంచఁ జాలె నెట్లు ?

గీ. ఒక్కమానవుఁ డయ్యుఁ దా నక్కజముగ
నందె నెట్లు మహామహిమాదికంబు ?
అనుచు నివ్వెఱపడి వేల్పు లభినుతింతు
రావసిష్ఠుని బ్రహ్మ తేజో విశిష్టు. ౪౫

ఉ. ఆనుత దీక్షలోఁ గలమహాత్త్వము మెచ్చి యొడంద నందినీ
ధేనువు చేరవచ్చి వినుతించె "వసిష్ఠ! మహర్షి చంద్ర! వ
త్సా! నిను మెచ్చి నీ కతిముదం బొదవింపఁగ వచ్చియుంటి నీ
దానను నేను నీ కిఁక సదా యొదవించెద సర్వసిద్ధులున్. ౪౬

గీ. తలఁచినది తక్షణంబ సంతసముతోడ
నీకు సమకూర్చుచుందు మానీ ! యసాధ్య
మేదియును గాదు దివిఁ గల్పవృక్షములును
మఱియుఁ జింతామణియును నామాత్రగావు. ౮౭

గీ. ఎవఁడు బ్రహ్మర్షి చంద్రుఁడై యొసఁగుచుండు
నతఁడె లోకసంరక్షణ మాచరించు
నట్టి యాతనికడనుఁడ నభిమతంబు
వచ్చితి వసిష్ఠ! నీ వట్టివాఁడ వౌట." ౮౮

మ. అని పల్కన్ విని సంతసంబున వసిష్ఠారుంధతుల్ భక్తిపెం
పున గోమాతకు నప్రదక్షిణముగా ముమ్మాఱు లేతెంచి "ఓ
జననీ ! నీకృప కిట్లు పాత్రులము వాత్సల్యంబు పాటించి మా
కనుకూలంబుగఁ జేయు మెల్లవియు నంబా ! నీకుఁ గైమోడుపుల్.

ఉ. తల్లివి నీవు లోకముల తల్లికిస్సైతము నందినీ ! కృపన్
జల్లని చూపు చూచినను జాలును లోకము లుల్లసిల్లు సం
ధిల్లు శుభంబు లెల్ల భవదీయశరీరమె సర్వలోక సం
పల్లలనాత్మకం బమృతపానము నిన్ గనులారఁ జూచుటల్. ౯౦

గీ. మాకు వలసిన దేమి యమ్మా ! తలంపఁ
దల్లి ! నీ విట్లు వచ్చితి దయదలిర్ప
వలసినప్పుడు తలఁతుము వచ్చి నీవు
మేలు సంధింపుమమ్మ ! మమ్మేలుకొమ్మ." ౯౧

మ. అని భక్తిన్ వినుతించు దంపతుల నత్యంతంబు దీవించి స
జ్జన మందారము కామధేనువు తథాస్తంచున్ యథేచ్ఛంబుగాఁ
జనియెన్; పిమ్మట మానిదంపతులు నిష్కామ్యాత్ములై దివ్యదీ
క్షను బెంపారి యొనర్పఁబూనిరి తపస్యన్ దీవ్రమార్గంబునన్.

సీ. ఒడయల కొడయఁడౌ నొడయని దలపోసి
యొడ లెఱుంగని యట్టి యొడమిఁ గనిరి
చూచుచుండియుఁ దాము చూడనిచూపును
జూడక చూచెడి చూపుఁ గనిరి
ఎఱుకల కెఱుక యౌ నెఱుకను గడియించి
యెఱుకపుట్టువులుగా నెఱుఁగుకొనిరి
చేయక చేసియుఁ జేసియుఁ జేయని
చేఁతలలో జగజెట్టు లైరి

గీ. వేనకును వేలు చట్టులై వెలయు నట్టి
గొప్ప జడదారి గుంపుల కెవ్వ డెఱుక
చూఱయిచ్చుచుఁ జుబ్బనచూఱ గాఁగ
బ్రతుకు మెలఁకువ లెఱిఁగి జంపతులు మనిరి. ౫౩

సీ. ఒకవంకఁ బతిదేవు నకలంక పరిచర్యఁ
దనుపుచుండును దాను దనియుచుండు
నొకవంక వ్రతపూర్తి సుకముగా నొనరించు
మునులకు నమృతాన్నముల నొసంగు
నొకవంక దేవతాదికపూజకై సుమ
ప్రకరంబు వివిధపత్త్రికలఁ గూర్చు
నొకవంక వ్రతముల సుకుమార దేహంబు
కృశముగాఁగను దపఃప్రశమ మొందు.

గీ. ఆశ్రమప్రాంగణంబున నలరు పుత్త్రి
సదృశ మగు జంతుకోటి భిక్షములఁ దనుపు
నొక్కవంక, నరుంధతి పెక్కుగతుల
భువనకల్యాణి యగుచుఁ గాపురము సేయు. ౫౪

సీ. అమల తపోగ్నిమధ్యంబున వెలుఁగుచు
రెండవ బ్రహ్మనా నుండుచుండి
తన ధర్మపత్ని యుత్తమసేవచేయుచు
నుండఁ జూడనియట్లు లుండుచుండి
తనశిష్యగణము దర్శనమాత్రచేతనే
ధన్యులఁజేయుచుఁ దనరుచుండి
తనదివ్యతేజ మూయనలేందు రవి మయూ
ఖముల నోడింపఁగఁ గ్రాలుచుండి

గీ. వాయుభక్షణ సాత్త్వికబలముఁ బడసి
నిత్యసంతృప్తుఁడై తాను నిఖలజగము
నిఖలజగమును దా నను నిజ మెఱింగి
వఱలుచుండు వసిష్ఠ దేవప్రభుండు. ౫౫

చ. అతని మహత్త్వముం దెలిసి యచ్చెరువంది మహేశ్వరుండు శా
శ్వతమహిమాస్పదం బఖిలశాసకశాసనదక్షముర్ మహో
న్నత మగు బ్రహ్మయష్టిని ముదంబునఁ బంపెను వచ్చిచేరె సం
తత పరిరక్షకం బగుచుఁ దా నది యప్పరమర్షి చెంతకుర్. ౫౬

క. ముని మూర్ధన్యుఁడు తనయం
గనతోఁ భయభక్తియుక్తిగౌరవముల న
వ్వినుతం బగు యష్టిఁ బ్రద
క్షిణమొనరించి కేలఁ గీలించె వెసర్. ౫౭

గీ. పాశుపతిచేతిశూలంబుపగిది, విష్ణు
కరకమలమందు వెలుఁగు చక్రంబు భంగి,
తగ మహేంద్రుని వజ్రాయుధంబు గతిని
బ్రహ్మయష్టి యొప్పును మునిప్రవరుచేత. ౫౮

ఉ. ఆదిసరస్వతీసహితుఁ డై నవిరించి మునీంద్రు మెచ్చి తా
నాదర మేదురంబుగను నక్షసరంబును బంపెఁ బంపఁగా
మేదురకాంతిపుంజముల మీఁదికిఁ జిమ్ముచువచ్చియద్ది స
మ్మోదముఁ గూర్పఁ జేరె మునిముఖ్యువసిష్ఠు మహాప్రదీపునిన్.

మ. ముని మూర్ధన్యుఁడు భక్తి మ్రొక్కి పరమామోదంబునం జేతఁ గై
కొని నేత్రంబుల కద్దుకొంచు శుచియై, ఘోరాఘసంతానముల్
కని దా దవ్వులనుండి పాఱఁగ, జగత్కల్యాణదం బై యవి
ద్యను నాశంబొనరించు నక్షసరముల్ దాల్చెన్ మహోత్సాహియై.

గీ. ఇభవరదు మెడనుండు కౌస్తుభ మనంగ
శివుని మెడలోని పునుకలచే రనంగ
వెలయుచుండె వసిష్ఠునిగళమునందుఁ
బరమరుద్రాక్షమాలికావరము మిగుల. ౬౧

గీ. కరివరదుఁ డైన విష్ణుఁడు గారవమున
మునిశిరోమణి కనిపె నమోఘమైన
మేలిబంగారుతోడ నిర్మితము నయిన
యొక కమండలువును మహిమోన్నతంబు. ౬౨

చ. పరమవినీతిఁ గైకొనెఁ గృపాపరతంత్రుని విష్ణుఁగొల్చి యా
పరమమునీంద్రుఁ డట్లమృతవారిని నింపిన కుండి భక్తితో;
కరుణవహించి యాఋషి శిఖామణి యందలి నీరుచల్ల స
త్వరశుభమౌను; గోపమున వారిని జల్లఁగ సర్వనాశమౌ. ౬౩

గీ. కామ్య మెఱుఁగని యాఋషిగ్రామణి యిటు
కరుణఁబడసి త్రిమూర్తుల వరము లందె
దివ్యమహిమాభిరాముఁ డై తేజరిల్లె
సాధ్వియైన యరుంధతి సహచరింప. ౬౪

చ. పిదప నరుంధతీరమణి పెంపును సొంపు పతివ్రతాత్వసం
పద గురుబోధమున్ బరమ మంగళరూపము మెచ్చియిచ్చెలన్
త్రిదశపతివ్రతామణులు దీవనలన్ శచి దివ్యగంధమా
ల్యద మగు రత్నపేటికయు నంపి రరుంధతికిన్ బ్రియంబుగన్.

మ. రమయున్ బార్వతియున్ సరస్వతియు నారామామణుల్ మెచ్చియు
త్తమ సాధ్వీతిలకం బరుంధతిని సందర్శించి సౌభాగ్య భా
గ్యము నిత్యోజ్జ్వల యౌవనంబు సుకుమారాకారమున్ సర్వసౌ
ఖ్యము లందం గల శక్తి నిచ్చిచని రత్యంతప్రమోదాత్మలై. ౬౬

క. నవయౌవన సౌందర్యం
బవయవములం జిందులాడ నతిభక్తిమెయిన్
ధవునకు మ్రొక్క నరుంధతి
నవయౌవన మందె నతం డనంతద్యుతులన్. ౬౭

క. దైవబలంబును మఱి వి
ద్యావిభవము జ్ఞానసంపదన్ గాంచి తప
శ్శ్రీవైభవ సంయుతులై
సేవించి రరుంధతీ వసిష్ఠులు గృహితన్. ౬౮

ఉ. పెక్కురు చక్రవర్తులకుఁ బెక్కురురాజులకున్ మహీస్థలిన్
బెక్కురురాజవంశ్యులకుఁ బ్రీతిగురుండు పురోహితుండునై
మక్కువ నాదరించుచు నమానుషభంగిని వారిఁబ్రోచుచున్
నిక్కపుదైవమైనెగడి నిస్తులకీర్తి వసిష్ఠుఁ డందఁగన్. ౬౯

క. భూజనులు సుఖం బుండిరి
రాజులు ధర్మాత్ములై విరాజిలిరి మునుల్
పూజితులైరి జగంబున
సౌజన్యమె వెల్లివిరిసె సంభావ్యముగన్. ౭౦

ఉ. ఒక్కమహర్షివర్యుఁడు మహోన్నతదివ్యతపస్యనుండఁగాఁ
జెక్కరు సౌఖ్య మందు టది పెద్దమె? రాత్రి విహాయసంబునం
దొక్కఁడు రోహిణీప్రియుఁడు జ్యోత్స్న విరాజిలుచుండు వేళఁబెం
పెక్కదె లోక? మల్లె రవి వెల్గ దివంబునఁ బొంగరే జనుల్? ౨౦

క. ఇంద్రాది దివిజనుతరా
జేంద్రులు పత్నులను గూడి యిష్టార్థములన్
సాంద్రత నందఁగ వచ్చి ము
నీంద్రుని సతిఁగొల్చి పోదు రిష్టావాప్తిన్. ౨౧

క. రాజు చెడి రాజ్య మెల్ల న
రాజక మగు వేళఁ దానె రాజయి రాజ్య
శ్రీ జెట్టవట్టఁ బ్రజ లే
యోజను జెడకుండఁ బ్రోచుచుండును ఋషియే. ౨౩

గీ. రాజసంతతిలో గుణరాజితుఁ డగు
క్షత్త్రవీరుని కారాజ్యసంపద నిడి
మగిడి వచ్చును రాజ్యమమత్వమింత
యైన లేక వసిష్ఠమహర్షి వనికి. ౨౪

ఉ. కంటికి ఱెప్పవోలెఁ బ్రజఁగాచుచుఁ దండ్రివిధాన నెప్డు, త
న్నంటఁగనీక రాజససుఖాశ లవంబును లోకసంగ్రహం
బొంటి నొనర్చుచుండి మహిమోన్నతి వెల్గు వసిష్ఠమౌని ము
క్కంటి విధానఁ, దాను దనకాంతను గూడి జగద్ధితార్థియై. ౨౫

చ. అలఘుతపస్వులైన మును లందఱుఁ బత్నులతో నరుంధతీ
లలన వసిష్ఠునిన్ గన సలక్షణభక్తి నరుంధతీవసి
ష్ఠుల సుకృతాశ్రమంబున విశుద్ధతపఃఫల మంద వచ్చి వా
రల పరిచర్యలన్ మిగుల రంజిలి పోదురు భక్తిఁగొల్చుచున్. ౨౬

శా. ఈరీతిన్ విలసిల్లుచుండిన మహర్షీంద్రుండు తా నాత్మలో
నారీరత్న మరుంధతీరమణి సౌందర్యంబు వీక్షించి సం
సార పరిస్ఫుట సత్ఫలం బొసఁగఁగా సంకల్పముం బూని య
న్నీరేజాసను నాజ్ఞనుం దలఁచి మున్గన్ రాగవారాన్నిధిన్. ౨౭

చ. పతియనురాగదృష్టి సతిపైఁ బడ నంతటి దాఁక నిట్టిసం
గతి యపురూప మశ్రుత మకాండశుభంబని యెంచు కాంతక
ప్రతిమముగా జనించె ననురాగము రాగమయాత్ములైన దం
పతులకుఁ దోడ్పడెన్ మదనపండితుఁ డెంతయు భక్తియుక్తులన్.

కం. త్రికరణశుద్ధాత్ములు స
ర్వకళాబహుపారదృశ్వ వర్యులు వారల్
త్రికరణములు నేకముగా
సకలశుభముహూర్త వేళ సలిపిరి కేళుల్. ౨౯

కం. తాపసరాజ్యంబును మఱి
భూపాలురలాజ్యలాభముం బొందినయా
తాపసదంపతు లందిరి
తాపాదికనిలయమహా మదనరాజ్యంబున్. ౩౦

చ. తపమున ధర్మబోధమునఁ దత్త్వమునన్ గడుదిట్ట కల్పపా
దపము నిజాశ్రితాళి కని తా రమణీమణీ మున్నెఱుంగుఁగా
ని పతిని గామతంత్రముల నిస్తులుఁడున్ నిపుణుండటంచుఁ బా
నెపుడు నెఱుంగదార! యిదియెంత యెఱుంగుట కామహర్షికిన్.

చ. పరమపతివ్రతామణి యుపాస్తహృదంతరవాంఛితార్థ సుం
దరి సుగుణాకరంబనియె తాపసి పత్ని నెఱుంగుఁగాని త
త్పరమరహఃక్రియా నిపుణతల్ మునుగాంచి యెఱుంగఁ డిప్పుడో
పరవశులైరి దంపతులు భవ్యపరస్పర శాస్త్రవిజ్ఞతన్. ౩౨

క. స్త్రీపశువు పురుషపశువును
జేపడి సంసారవృద్ధి చేయుట లేదా?
యేపగిది భేదమేర్పడు
నా పసులకు మానవులకు? నరయఁగవలదే? ౮౩

చ. నియమవిహీనులై పరమనింద్యత నిగ్రహ మింతలేక యా
మయముల కాలవాలమయి మారశిలీముఖదష్టచిత్తులై
వయసు వృథాయొనర్చు నరవర్గమెయౌఁ బశువర్గ; మిట్టిదు
ష్క్రియులకు నిగ్రహవ్రతిఋషీశులకుఁ గట! పోల్కియున్నదే?

చ. నిరుపమయౌవనంబు నతినిష్ఠుర నిగ్రహ నిశ్చలాత్ములన్
బరమశివాంకితంబుగఁ దపఃక్రియలందు వ్యయించి యీశ్వరే
శ్వర పరిపూర్ణసత్కృపకుఁ బాత్రులు దివ్యులునై తదాజ్ఞచే
వరసుతులన్ గనంగ భయభక్తి రమించుట యెంత భాగ్యమో!

గీ. శుక్తిరజతంబుఁ గూడెడిసొంపు గదుర
స్వర్ణ సౌరభసంగమ సంగతి గస
పుష్ప సురభిళసంయోగము పురుడింపఁ
గూడి రప్పు డరుంధతీ కుంభభవులు. ౮౬

గీ. పుణ్యతార్తీయ పురుషార్థమును భజించి
యుల్లసిల్లి రరుంధతీ వల్లభు లిటు
కొన్ని వేలేండ్లు; వారల కూటమిని జ
నించె సుతశత మఖిలమునిప్రవరము. ౮౭

మ. తొలుతన్ బుట్టినపుత్త్రిరత్నము జగత్స్తుత్యుండు శక్త్యృషి య
య్యలఘుబ్రహ్మమునీంద్రుఁ డొప్పెసఁగి భార్యారత్నముం గాంచి యా
లలనారత్నమునన్ బరాశరుఁ దపోలక్ష్మీమయుతున్ గాంచఁగన్
విలసిల్లెన్ ఋషివంశముల్ క్రమముగా విఖ్యాతవాసిష్ఠముల్. ౮౮

మ. పిదపం బుట్టిన పుత్త్రులెల్లరుఁ దపోవీరుల్ మహాభావులై
యుదితార్కోపమతేజులై వెలసి రీయుర్విన్ ఋషీంద్రావళిన్
సదసద్భేదవివేకులై చతురులై జ్ఞానప్రవిష్టాత్ములై
పొదలం జేసిరి వంశవర్ధనము నంభోరాశి చందంబునన్. ౮౯

గీ. కడుపుచల్లని తల్లియై క్రాలె నిట్లు
భువి నరుంధతి లోకైకపుణ్యసాధ్వి
మఱి వసిష్ఠుఁడుఁ బిదప సమ్మాన్యుఁ గూడి
తనరుచుండె వానప్రస్థ ధర్మరతిని. ౯౦

మ. జగదాశ్చర్యకరంబులైన కృతులన్ సమ్యగ్గతిం జేసి వే
లుగ నాతండొనరించెఁ బేర్కొనఁగఁ జాలున్ శేషుఁడో లేక స
ర్వగరిష్ఠప్రతిభావిశేషుఁడెవఁడో బ్రహ్మాండనాథుండు; నే
యుగమం దన్యుఁడెవండుఁ బేర్కొనఁగ లేఁడోహో! వసిష్ఠోన్నతుల్.

క. నిమిశాపము విశ్వామి
త్రముని పరాజయంబు ఋషివతంసుల ప్రోపున్
అమలిన రామ గురుత్వము
జమయానే యతనికోటిసత్కృతులందున్. ౯౨

క. ఒక దివ్యనదీతీరము
నకుఁ జని ముని, యాలియున్ విశ్రమతఁ గొలువన్
వికచహృదయాంబుజుండై
యొక యాశ్రమమందుఁ బుచ్చుచుండె దినంబుల్. ౯౩

క. ఆనది కావలియొడ్డున
మానిమణి యగస్త్యుఁ డుత్తమవ్రతదీక్షా
నూనుండై యేకాగిగ
మానితముగ వాయుభక్ష్యమాత్ర వసించున్. ౯౪

చ. అమలవసిష్ఠమౌని తనయాలిని గూడి నదిన్ దరించి పో
యి మహితదీక్ష నున్నపరమేశ్వరరూపు నగస్త్యుఁ జూచి త
ద్విమలపదాంబుజంబులకుఁ బ్రీతిని మ్రొక్కి సభార్యుఁడై వడిన్
సుమహితపూజ చేసి తముఁ జూచిన మౌనికి భక్తి నిట్లనున్. ౯౫

గీ. "నహుషహుంకారి! నీదుమౌనవ్రతంబుఁ
జెఱుపఁదలఁపము మముఁ గటాక్షించి మేము
నిత్య మొసఁగు నాతిథ్యమున్ స్వీకరింపు
మవలిపొద్దునఁ గలమయ్య!" యన నతండు. ౯౬

మ. జగదభ్యర్చితు లౌనరుంధతి వసిష్ఠబ్రహ్మ యిట్లేఁగుదెం
చి గరిష్ఠం బగుపూజచేసి యడుగన్ సిద్ధంబె కా కన్య మె
ట్టిగతిన్ బల్కుఁడు నంచు లోఁ దలఁచి యట్లే నాఁగ నూపెన్ దలన్
మగునన్ గూడి వసిష్ఠుఁడున్ మరలె బ్రహ్మానందితుండై యింటికిన్.

క. అది మొదలు దినదినంబును
సుదతి యరుంధతి వసిష్ఠచోదితయై పెం
పొదవఁగ షడ్రససంయుత
పదార్థములు చేసి మునికి భక్తిని బెట్టెన్. ౯౭

ఉ. పెట్టిన యాపదార్థములఁ బ్రీతిని గొన్నిటిఁ గొంచు మౌనిస
మ్రాట్టు భుజింపఁ బిమ్మట నమస్కృతిఁ దత్పరిభుక్తశేషమున్
గుట్టుగ నాయరుంధతి యకుంఠితభక్తిని నిల్లు చేర్చి తాఁ
బెట్టును భర్తకున్ బిదపఁ బ్రీతిఁ గొనున్ బతిభుక్తశేషమున్. ౯౮

చ. మునులకు నెల్లఁ బెద్ద లయి పూజ్యుల కెల్లను బూజనీయులై
యనుపమ విజ్ఞు లయ్యు నహహా! పరిపాటి సపర్యచేయఁగా
మునులకుఁ గోరుకొంద్రు బహుపూజ్యుల కెన్నఁడు గర్వముండునే?
ఘనులకుఁ బూజ్యుఁ డౌనతిథి కన్పడుకంటెను భాగ్యమున్నదే?

చ. అనుదిన మిట్లు చేయుచు గృహస్థమహోత్తమ ధర్మకర్మ మ
త్యనుపమదీక్షతో నతిథి యారయ దైవమె యంచుఁ గొల్చుచున్
మునికులముఖ్యులున్ వినయభూషణు లైనవసిష్ఠమౌనియున్
వనితలకున్ శిరోమణి యనందగునాతనిపత్ని యుండఁగన్. ౧౦౧

చ. ఒకదిన మి ట్లరుంధతి మహోత్తమసంయమి యానగ స్వయమా
నికిఁ దనయాతిథేయమును నిస్తులభక్తి గ్రహించి పోవువే
ళకు నది పొంగి పాఱుచుఁ జలంబున నొడ్డులు డాయ దాఁట నే
రక వెనుదిర్గి వచ్చి మునిరాజు వసిష్ఠున కెల్లఁ జెప్పినన్. ౧౦౨

గీ. "తరుణి! యోడక నీవు వేగిరమె పోయి
మనవియొనరింపు మానదీమాతతోడ
నను సదాబ్రహ్మచారి పంపెను గటాక్ష
వీక్షణంబునఁ దెరువిమ్ము వేగ ననుచు. ౧౦౩

క. తెరు విచ్చును నీ కానది
వరనియమవ్రతుల కడ్డువచ్చుట కెపు డె
వ్వరు నోపరు చని రమ్మని
పరమర్షి వసిష్ఠుఁ డంప వనితయుఁ బ్రీతిన్. ౧౦౪

చ. హృదయమునం గుతూహలము హెచ్చఁగ వేగిర మేఁగుదెంచి యా
నదికిని మ్రొక్కి భక్తిఁ దననాథుఁడు చెప్పినరీతిఁ బల్కఁగా
ముదమున దారియిచ్చి నది పొమ్మని పల్కిన సంతసంబుతోఁ
బదపడి యామె పోయెఁ బదపద్మములన్ దడి యంటకుండఁగన్.

గీ. ఆమె కడచని యఱిగినయంత నదియుఁ
గడుభయంకర మైనవేగంబుతోడఁ
బాఱఁ దొడఁగెను సుడులతోఁ బ్రాభవమున
నెవ్వ రిఁక నన్ను వారింప నిల ననంగ. ౧౦౫

ఉ. కడువడి నాయరుంధతి యగస్త్యునిపాలికి నేఁగి భక్తితోఁ
గుడువఁగఁ బెట్టి యోగిరము కొందలమందుచు "దేవ! యెట్లు నే
వ్వడిఁ బ్రవహించునీనదిని వైళమ దాఁటుదుఁ జెప్పు మన్న న
ప్పుడు మునిమౌనమున్ విడిచి "ముందెటువచ్చితివమ్మ చెప్పుమా!"

క. అని యడుగ నరుంధతి భ
క్తిని దెల్పెను భర్త తనకుఁ దెలిపినరీతిన్
మునియును జిఱున వ్వొలయఁగ
ననియెన్ సమ్మదముతోడ నయ్యంగనకున్. ౧౦౮

గీ. "ఉవిద! పల్కుము నిన్ను నిత్యోపవాసి
పంపినాఁ డని యానది పాయయిచ్చుఁ
దన్వి! యఱకాలు తడిగాక దాఁటఁగలవు
నిన్ను వారింపఁ గలవస్తు వున్నె? జగతి." ౧౦౯

క. అని పలికిన మునిపత్నియు
ననుపమ మగుభక్తి మ్రొక్కి యాతని కరిగెన్
మును వచ్చినత్రోవనె వ
చ్చినఁ బొంగుచు నుండె నది విశేషత్వరతోన్. ౧౧౦

చ. కరములు మోడ్చి మ్రొక్కి మునికాంత నదీప్రియమాతకున్ భయం
కరముగఁ బాఱుచుండఁగ నగస్త్యుఁడు పల్కినపల్కు పల్క న
చ్చెరువుగఁ దత్క్షణంబె నది చిత్రముగాఁ దెరువిచ్చి పొమ్మనన్
బరమఋషీంద్రపత్ని పదపద్మము వాడక వచ్చె నింటికిన్.

గీ. అతిథిభుక్తాన్నశేషంబు నతిముదమున
భర్తకును బెట్టి భుజియించువఱకు నుండి
అతనిభుక్తాన్నశేషంబు నమృతమట్లు
కుడిచె నప్పు డరుంధతి కూర్మి మీఱ. ౧౧౧

చ. మనమున నాఁటియచ్చెరువుమాటలభావ మెఱుంగఁగోరి యా
వనిత యనంతరంబు పతిపాదము లొత్తెడివేళ భక్తి పెం
పున సుముఖాత్ముఁ డైనమునిపుంగవు నిట్లడిగెన్ "మహాత్మ! నా
కును దెలుపంగదే ప్రియముఁ గూర్పఁగఁ గల్గినసంశయార్థముల్.

సీ. పరమేశ! మనకు నూర్వురు పుత్త్రు. లెటు సదా
బ్రహ్మచారివి నీవు? పరమచిత్ర.
మిది విని నది తెరు విచ్చుట మఱి చిత్ర
మీచిత్రమును మించు నింక నేను
నిత్యంబు నన్నాది నియతిఁ బెట్టఁగఁ దిను
నతిథి నిత్యోపవాసిత తలంప
నిది విని నది తెరువిచ్చు టింకొకచిత్ర
మీచిత్ర పరమార్థ మెఱుఁగఁ జెపుము

గీ. అనినఁ జిఱునవ్వు మెఱయఁ దదాననమునఁ
"గాంత! యిట్టివి ధర్మసూక్ష్మములు వీనిఁ
దెలియుదురు మాదృశులు ఋషుల్ తెలియ రన్యు
లిది యెఱింగింతు వినుము నీ వించుఁబోఁణి! ౧౧౪

సీ. ఋతుకాలమున నాత్మసతిఁ గూడి పెఱయుష్ఠ
భ్రాంతిహీనుఁడు సదా బ్రహ్మచారి
యశన మబ్బకయున్న నబ్బిన సమముగా
నుండునాతండు నిత్యోపవాసి
మనలఁ గటాక్షింప మనయాతిథేయంబుఁ
గొనుఁ గాని వాయుభక్షుం డతండు
కావున నింతటి గౌరవం బేర్పడె
మామాటలకుఁ దన్వి మహి" ననంగ

ఘుగుల నాశ్చర్యముం జెంది మించుఁబోఁడి
యగునరుంధతి మఱియింతియాదరమున
నతిథిసేవయుఁ బతిసేవ యాచరించి
శాశ్వతయశస్సు గడియించె జగతియందు. ౧౧౫

సీ. తమపాదధూళి గొంచెము సోఁకినను గాని
యఖిలంబుఁ బావనం బై తలిర్ప
తమ్ము సమ్మానించి దర్శించుజనములు
నఘదూరు లగుచు దివ్యత గడింప
తమయనుగ్రహముఁ గొంచెముఁ గాంచువారైన
దివ్యభోగంబులఁ దేలుచుండ
త మ్ముపాసించుపుణ్యమ్ముఁ గూర్చినవారు
జ్ఞానులై పరమవిజ్ఞత గడింప

గీ. శాశ్వతంబుగఁ బరమ నక్షత్రము లయి
మూఁడులోకము లేలుచుఁ బొలుచుచుండు
రతులితాదర్శదంపతు లయి యరుంధ
తీవసిష్ఠులు నేఁటికి దివ్యధాత్రి. ౧౧౬

చ. ఇలను వివాహవేళ సకలేప్సితసిద్ధి కరుంధతీవసి
ష్ఠులె ఘనసాక్షులుగ మఱె యశోవిభవప్రదులై యనేకపూ
జలఁ గొనుచుగ వధూవరుల నంతతసత్కృపఁ బ్రోచుచుందు రీ
యిలకు నుమామహేశ్వరులు నెన్నఁగ ధార యయి శాశ్వతంబుగన్.

గీ. ఇది యగు నరుంధతీవసిష్ఠకావ్య
రాజమునఁ దృతీయాశ్వాసరాజ మీశ!
గురువరా! త్వత్కృపామృతభరితమాను
కీనవాఙ్మయ మిదియు నంకితము నీకు. ౧౧౭

శ్రీ శ్రీ శ్రీ

# తుదిపలుకు

అరుంధతీ వసిష్ఠ మతిపవిత్రమైన పద్యకావ్యము. ఇందలి యితివృత్తము వివిధపురాణాంతర్గతము. ప్రధానకథ అరుంధతి జననము, బాల్యము, పరీక్ష, వివాహము, అరుంధతీ వసిష్ఠులసాంసారిక తపోజీవనము వారి యౌన్నత్యమును.

శ్రీలక్ష్మీనారాయణులు, ఉమామహేశ్వరులు, వాణీ హిరణ్యగర్భులు, శచీపురందరులు, అరుంధతీవసిష్ఠులు, సీతా రాములు సర్వకాలసర్వలోకపూజ్యు లగునాదర్శదంపతులు. భారతీయుల భాగ్యఫలములు, అరుంధతీవసిష్ఠులను గూర్చి యెంతయైన వ్రాయవచ్చును. వ్రాయఁగలను. కాని, నేఁటి వారి కల్పకాలసమాప్తములగు లఘుకృతులే కావలయును. అందుచే 'ముక్తసరి'గ మూఁడాశ్వాసములలో మూఁడు నూటపదియాఱుల పద్యములతోఁ బ్రధానకథఁ దెలిపితిని.

ఉత్తమకవులయడుగుజాడలలో నడువ నుబలాట పడుటకన్న నధికార్హత లేనియస్మదాదులఋషిగుణప్రశంస పేలవముగఁ దోఁపకపోదు. ఐనను, సహృదయు లిందలి గుణలేశమునే గ్రహించి యాదరింతురుగాక!

బు॥ వేం॥

# ఆనందతరంగము

సముచితసత్కళాభ్యుదయసార మనంగ నరుంధతీవసి
ష్ఠము తనరారుచున్నది రసప్రథితంబగు కావ్యరాజమై
విమలమతిన్ బఠించునెడ విజ్ఞులకైనను జ్ఞానభిక్ష నె
య్యమున నొసంగుచుండును గృతార్థుఁడవైతివి వేంకటేశ్వరా!

చక్కనిశైలిలో మిగులఁజక్కనిపొందికతో మృదూక్తులన్
జక్కగఁ బాదుకొల్పి వెదచల్లితివయ్య! అరుంధతీసతిన్
జక్కగఁ జేసి వ్రాసితివి సొంపుగ నింపుగఁ బెంపుగాఁ గడున్
జక్కనికైత నీది కవిసత్తమ! నీ కివె ధన్యవాదముల్.

విమలవియన్నదీసరణి విశ్రుతమయ్యె నరుంధతీవసి
ష్ఠము రససౌకుమార్యమునఁ జక్కనిభావపరంపరాప్రవా
హముగతిచేఁ బవిత్రితను తారవితారకమై మహాప్రపం
చమున విరాజిలున్ బరమసత్కృతియై బుధకోటి మెచ్చఁగన్.

జటప్రోలు సంస్థానము. రా. ఘ. రాట్కవి.